# తెలంగాణా వార్తలు

## సిరిసిల్లతాలూకా పైరుల ఫలితములు

### మాఫీలు అవసరము

నేను ఈమధ్య నాటుపనియుండి సిరిసిల్లతాలూకాలో చాలగ్రామములు తిరిగితిని నేను చూచియు రైతులవలన వినియు చాలదుఃఖించితిని పంటలు గతసంవత్సరము లైదింటికంటెను అధ్వాన్నముగా పండినవి ప్రాగసపంటలు బాగాలేవు పోసి వరిపంటయైనను ఈవిధసంవత్సరములలోవలెనైనను పండినవాయనిన అదియూలేదు ఈసంవత్సరము చెరువులలోనికి నీళ్లు చాలవెనుకవచ్చినవి అక్షేపముఖు కొర్తులలో నీళ్లువచ్చుటచే అన్నియు మఘకార్తిలో అలుకన్ప్లఅయినవి మఘకార్తిలో అలుకన్ప్లఅయిన వరిపైరులకు విశేషము గాన్నాధులు క్రిమిబాధలు కలుగుట జగిపత్రి సిద్ధము అక్లే మున కార్తి అలుకుబ్ల వేయనికారణము న కాలదోషము పైరకు పట్టక తప్పునదికాదు వరిపైరులకన్నిటికి ఒక్కటేయైన మిగులకుండ తెగుళ్ళ పురుగులుతగిలి అధికనష్టమైనవి ఎన్నో తలఫుమాలుకూడ అయినవి తలఫుమాలు దరఖాస్తులు యివ్వబడి మాఫీలకొరకు ప్రార్థించుచున్నవి తలఫుమాలు మాఫీపొందుటకుగా ఈ పంటయొక్క పరిమితికి ఏకొంచము ఎక్కువయినా మాఫీ యివ్వబడునుగదా? ఇన్ని మాఫీసౌకర్యమునుండి తప్పినవి ఎన్నోకలవు నా టినష్టము ఎట్లుపూర్తికావలయును? పైగ కొరకు రైతులకు అయినవ్యయమును పెట్టినపెట్టుబడి, పంటలయొక్క మిగులుబడిపైన యాధారపడియున్న యతనియొక్కయు, కుటుంబముయొక్కయు, ఇతరులయొక్కయు జీవితవ్యయము అట్లుండ అనివార్యమైన నూమికిస్తు పెట్టుచెల్లింపవలయును దీనినుండి దాటుటకు తెరవేది సగముపంటయైనను పండలేదు కిస్తు చెల్లించుటకేమియులేదు అధికధరకే అప్పుతెచ్చి పైరుకై చేసినవ్యయము పెట్టిన పెట్టుబడిని తీర్చివేయుటకేమియులేదు అఖరుకు ఆమట కూడ కొరతయే ఇట్టుంట రైతు నిలువగలుగునెట్లు? ఆతని నీఘోరావస్థనుండి తప్పించుటకు మొత్తముమీదపై సాముదాయికమాఫీలవసరము దయామయులగు ప్రభుత్వమువారు మా బీదరైతులకు మాఫీలను ప్రసాదించి మమ్ము దుఃఖసాగరమునుండి తీరమునకు జేర్చుదురుగాక యని వినయపూర్వక ప్రార్థన

నీళ్లు చాల వెనుకవచ్చినవికదా ఇప్పుడేలికిన పైర్లు నష్టపడును అలుకకు ఊరకుండమనిన మఘకార్తిలో నీళ్లువచ్చినను అలుకవలయునను నియమము నిర్బంధముగానుండుటచే పైరుచేయక తప్పినదికాదు ఈనియమము నష్టదాయకము బాధాకరము తగినఫలితము కలుగక పోగా క్రమక్రమముగా దీనికిబదులు కృషిసంబంధమైన వేరేపని జేసుకొని జీవికకు తగినసంపాదనకై యత్నించుటకు అవకాశములేకుండ బోవుచున్నది ఈకష్టము నివారింపదగినది రైతుల క్షేమమున్నే కోరునట్టి మనదయామయ ప్రభుత్వమువారు ఈకాలపరిమితిని తగ్గించెదరుగాక!

ఒక రైతు

## పావలాపంటకూడ లేదు

[స్వకీయ విలేఖరి)

సిరిసిల్ల: తేది ౨౯-౧౧-౩౬ ఫ

### పైరుల ఫలితము

ఇట పంటలు ఏమాత్రము బాగుగా పండలేదు ఆబీ (వరి) పైరులు చెరువులలోనికి నీళ్లు చాల వెనుకవచ్చినకారణమున ఆలస్యముగా పైరుచేయుటచేత పైరులకు రోగములుతగిలి చాలా నష్టమైనవి కొన్నిటిలో పావలాపంటయినలేదు తలఫుమాలు దరఖాస్తులుపడి విచారణజరుగుచున్నది తక్కినవానిలో సగము పంటయైననులేదు

### జూబిలీ జ్ఞాపకచిహ్నము కూలిపోవుట

ఇట మనప్రభువుగారి రజతోత్సవ జ్ఞాపకార్థము కొందరు న్యాయవాదులచేత కట్టింపబడిన కమాను కూలిపోయినది వేలమట వేసినది అది కూలినప్పుడు కమానుమీద కూలీలుపనిచేయుచుండిరి ఆకస్మాత్తుగా పగులుజూపుటను ఒకకూలిచూచి తక్కినవారికిచెప్పగా నందరు క్రిందికిదిగిరి వారు దిగుటకయితేదప్పగ ఒక్కసారిగ నేలగూలెను వారు జాగ్రత్తచేయనిచో బీదకూలీలకు చాలప్రమాదము కలుగుచుండెడిది గొప్పవిపత్తులను తప్పించుకొనినందుకు నిరుపేదలగుకూలీలకుఅభినందనములు

### మున్సిఫుగారి తబాదిలా

స్థానికమున్సిఫుగారగు జనాబు మౌల్వీ గులాంమహమ్మదుసాహెబుగారు ఇచటినుండి జేరాకచోటికి మార్చబడిరి ఈరెండుకొలాలలోనే వారుసిరిసిల్లను వీడగలరు వీరు సత్స్వభావులు, నిష్పక్షపాతులు అందరిచేతను సమముగా ప్రేమింపబడినవారు

## అయిదవ ఆంధ్రమహాసభకు విజ్ఞప్తి

పంచమాంధ్రమహాసభ మహబూబునగరం జిల్లాలోని షాదునగరంలో జరుగుచున్నందులకు నేను సంతసించితిని ఇదేజిల్లాలోచేరిన దేవరకదర గ్రామమునందు ఒక అనాథ విద్యార్థి గృహము ఏర్పరచి మొన్న దసరానాడు వార్షికోత్సవము జరిపిరి అనాథ సభయందు గౌరవకార్యదర్శియగు శ్రీయుత జి.యస్ కిష్టాగారు గతసంవత్సరం ౧౩౦ రూపాయీలు ఖర్చైనట్లు తెలిపిరి ఈసంస్థకు అయిదవ ఆంధ్రసభపక్షమున కొంతసహాయము అయినయెడల ఈ సంస్థకై పాటుబడువారు నిర్భయముగా కార్యము నడిపించగలరు తప్పక సహాయమగునని నేను నమ్ముచున్నాను

ఇట్లు
సూరంపల్లి శంకరయ్య
దేవరకదర

### కీ॥శే॥ వామన్నాయకుగారు

#### తెలంగాణా జిల్లాలలోవిషాదము

నాల్గైదు ౧౩౦౭ గురువారమురాత్రి ౯ గంటలకు చిన్ననరం వామయ్యగారి అధ్యక్షతన ఘరఖునగరం [జాగీరు పేషక్కారీ] హిందూ ధర్మసమాజమువారు సమావేశమై విషాదతీర్మానము చేసిరి ఆనాటికి జన ఖాళీ

తెల్లమద్దిలో శ్రీరామకృష్ణాంధ్ర పఠనాలయ యాజమాన్యమున ప్రత్యేకసమావేశము ౧౦ నా ౧౩౦౭ నాడు జరిగి విషాదతీర్మానము చేయుటయేగాక నాయకుగారి ముఖ్యయితానుసారము మద్యపాన విసర్జనప్రతిజ్ఞను కూడ చేసిరి

ఖమ్మంమెట్టులో హరిజనపాఠశాల మూయబడెను సాయంకాలము పాఠశాలలో కీర్తిశేషుని ఆత్మశాంతికై ప్రార్థనలుచేయబడెను

## ౧౦వ ఆంధ్రరాష్ట్ర మహిళా మహాసభ

### పాల్వంచ సంస్థాన వార్తలు
### సంస్థాన తాలూకుదారు సా॥ గారికి వీడ్కోలు

[స్వకీయ విలేఖరి]

బూర్గంపాడు ౨౫-౧౧-౩౬

ఈసంస్థానమున షెలుగెండ్లనుండి, దర్పం తాలూకుదార్ పదవితో వసీఫాపొందినజనాబు మౌల్వీ ఖలీఫా అహమ్మదుసా॥ గారు తాలూకుదారుపదవి వహించి రైతుల యోగక్షేమములు తెలిసికొనుచు నూతన మార్పులనేకములు జరిగించిన మయుద్యోగమును విరమించి వెడలు సందర్భమున స్థానిక రైతు ప్రముఖులు, వర్తకులు, ఉద్యోగస్థులుకలిసి వారి గౌరవార్థము ౨౧వ తేదీన తహశీలుఆఫీసు ఆవరణమున గొప్పసమావేశము నుజరిపించి అల్పాహారముల నొసంగిరి రైతుసంఘపక్షమున వీడ్కోలు పత్రము సమర్పించబడెను పలువురుప్రముఖులు వారుసంస్థానమునకుచేసిన సేవను కొనియాడిరి తాలూకుదారు సా॥గారు తమకృతజ్ఞతను వెల్లడించిరి మరునాడువారు ఇ౦కు వెడలుసందర్భమున గుంపులగుంపులుగ చిన్న పెద్దలు ఉద్యోగస్థులు వీడ్కొల్పిరి

### సదరునాజం సా॥ కోత్వాలిబహద్దరు వారి యాగమనము

వీరు నిన్నటిరోజున పాల్వంచముకాంకు విచ్చేసి యీరోజున యిక్కడదయచేసి సంస్థాన కచ్చేరీలన్నిటిని చూచివెడలిరి

### భద్రాచలం ౧౦వ ఆంధ్రరాష్ట్ర మహిళాసభ

నవంబరు ౨౭ ౨౮ ౨౯ తారీఖులందు ఈసభ ఇందుకేర్పాటుకాబడిన మంటపమునందు సమావేశమైనది అధ్యక్షురాలుగా ఎన్నుకొనబడిన శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు రాజాలకపోయినందున విద్యార్థి శ్రీమతి ఒత్తులకొమాక్షమ్మగారధ్యక్షతవహించి సభ జయప్రదముగా జరిగించిరి విద్యా సాంఘిక విషయములగురించి పెక్కుతీర్మానములు చేయబడెను విదుషీమణులు పెక్కురువిచ్చేసిరి ఉపన్యాసములు గానము నృత్యము, పుణ్యస్థలసందర్శనములు జరిగినవి ఈమన్నెప్రాంతములందు ఇదివరకే సభయు యిక్కడ జరిగియుండలేదు స్త్రీలే ముందంజవేసి యీప్రబోధమును కల్గించుట శుభసూచకము మార్గదర్శకము

## హైదరాబాదు యువకనాయకుల వివాహములు

హైదరాబాదు నగరమందు "ఆంధ్రయువకులు" అనబడువారలలో ముఖ్యులగు శ్రీయుత నందగిరి వెంకట్రావు, బి.ఏ.,ఎల్.ఎల్.బి. గారియొక్కయు, శ్రీయుత భాస్కరభట్ల కృష్ణారావుగారియొక్కయు వివాహములు గత వారమునందు జరిగినవి, గతగురువారమునాడు శ్రీయుత భాస్కరభట్ల కృష్ణారావుగారి పాణిగ్రహణము పూర్వ మొకప్పుడు సుజాతపత్రిక సంపాదకులుగనుండిన శ్రీయుత పి. యన్. శర్మ, బి.ఏ.,ఎల్.ఎల్.బి గారి జ్యేష్ఠపుత్రికయగు శ్రీమతి సుశీలతో జరిగెను, అంతకుముందు ఆదివారమునాడు శ్రీయుత నందగిరి వెంకట్రావుగారి పాణిగ్రహణము శ్రీయుత పద్మకొండ నరసింహారావుగారి కుమార్తెయగు ఇందిరాదేవితో జరిగియుండెను. ఇట్లు వెంటవెంటనే ఈవివాహములు జరుగుట ఒకవిశేషము. రెండవవిశేషమేమన రెండువివాహములును కాచిగూడెములో పుణ్యాపనమందే జరిగియుండెను. నందగిరివెంకట్రావుగారు "హైదరాబాదు ఆంధ్రయువకుల నాయకులుగ నెంచబడుచున్నారు. వీరు కృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయపు కార్యనిర్వాహకవర్గసభ్యులు, ఆంధ్రత్వమనిన మిక్కుటమైన అభిమానము. వీరు పరిగ్రహించిన శ్రీమతి ఇందిరాదేవి నిజాంరాష్ట్రాంధ్ర చతుర్థ మహిళాసభ స్థాయిసంఘ కార్యదర్శినులలో నొకతె. భాస్కరభట్ల కృష్ణారావుగారు నందగిరివారికి ఒకభుజమువంటివారు వీరుకృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయమునకు కొంతకాలము సహాయకార్యదర్శిగనుండి ఇపుడు కార్యనిర్వాహకవర్గసభ్యులైయున్నారు. వీరికిని ఆంధ్రత్వమనిన అమితమైనపట్టు. ఆంధ్రులుచచ్చుగానుండక గౌరవముగా బ్రతుకవలెనని వీరిభావము.

నందగిరి వెంకట్రావుగారి వివాహములో ఈకృష్ణారావుగారు నాలుగుగీతములును సమర్పించిరి. అందు సంబోధించి "తెనుగురాజుల చండకౌర్యము—తెనుగుయోధుల వీరచరితము—చిన్నకథలను చిలుతవెలుగుల చిమ్మ చెప్పుమి అన్నయా" అని ఇదేవిధముగ తమవరములనడిగిరి. క్రొగ్రొత్తదంపతులు "మందారమాల"ను సమర్పించిరి. అందు నాల్గవపద్యములో "కాలగర్భంబు నకలసిన మనకాకతీయ కీర్తినిపైకి తీయవలయు—పరసంఘముల వెన్కదీయున్న మనయాంధ్రసంఘంబు ముందుకుజరుపవలయు" అని కోరి "భార్యభాగ్యశాలినిగాదు భాగ్యదరాలన్న నియతి దేశంబున నిలుపవలయు. అఖిలప్రపంచాన ఆంధ్రవనిత తెందు దీసిపోవరటంచు తెలుపవలయు" అని కోరబడినది. ఈవివాహముతో వధూవరులకు కానుకలుగ అనేకపుస్తకము లీయబడుట మంచిఆచారము.

భాస్కరభట్ల దంపతులకు కొంతకాలము ఆంధ్రయువజన సంఘకార్యదర్శిగనుండిన పెద్దిరెడ్డి మాణిక్యారావుగారు "ఐదుమాణిక్యాలు" ఇచ్చిరి. "కళదొ మార్గము గాగకూడి పాండోయి" అని ప్రారంభించి "కళనుమించినదేది ఇలనులేదనివీరు కలముకుంచెల చాటుదోయి" అను పల్లవితో కృష్ణాసుశీలలను "కలముకుంచెలకెప్పుడు మారుపేరులపొంది ఉరూరయుంటొంటు" చూడగలమను ఆశతో ఈ "మాణిక్యాలు" అంతమగుచున్నవి.

---

## చతుర్థ ఆనువంశికాయుర్వేద వైద్య సమ్మేళనము, హంపీ

ఈ సమ్మేళనముయొక్క నాల్గవ వార్షికసమావేశము కర్ణాటక ఆయుర్వేద మండలివారి యాజమాన్యమున హంపీలో డిసెంబరు ౨౮, ౨౯వ తేదులలో జరుపబడును. ఆమహాసభకు స్వర్గీయపండిత మోతీలాల్ నెహ్రూగారి వైద్యులును, కలకత్తాలో ప్రచురింపబడుచున్న "ఆయుర్వేద" పత్రికా సహాయ సంపాదకులునగు యమ్.కె.ముఖర్జీ బి.ఏ.గారు అధ్యక్షతవహింతురు.

ఈసమావేశము జరుగు దినములలోనే కర్ణాటక ఆయుర్వేదమండలివారు త్రిదోష సిద్ధాంతమును జర్పించుటకు కలకత్తాలో ప్రచురింపబడుచున్న ధన్వంతరీపత్రికా సంపాదకులు మదరాసు విశ్వవిద్యాలయమువారివలన త్రిదోష సిద్ధాంతమునందు వారికిగల ప్రత్యేక నైపుణ్యమునకు J C BsC. బహుమానమునుబొందిన కవిరాజ దినేంద్రనాథురే యమ్.యస్.సి.గారు అధ్యక్షతవహింతురు.

హంపీక్షేత్రము రామాయణ కాలమునుండియు మిగుల ప్రశస్తమైనది. అట్టి ప్రదేశములో విజయనగర షట్శతాబ్ద మహోత్సవము జరుపబడుచున్నది. ఏతత్సందర్భమున భారతదేశమునుండియు అనేకదేశములనుండియు ప్రేక్షకులు యాత్రికులు పెక్కురువత్తురు. ఈమహోత్సవము మైసూరు మహారాజవారిచే ప్రారంభింపబడును గావున ఆయుర్వేదసభకువచ్చు ప్రతినిధులుముందుగా వారిసంఖ్య మాకు తెలుపనిచో వారికిదగు వసతుల నేర్పాటు చేయుట దుర్లభము. వచ్చు ప్రతినిధులెల్లరు ముందుగా రు ౩–౦–౦ ప్రతినిధిరుసుమును, (రు ౨–౦–౦ డెలిగేటుఫీజును, రు. ౧–౦–౦ లాడ్జింగు) వైద్యభూషణ డి.కె.భరద్వాజ. యమ్.డి. ఆర్గనైజింగు జనరల్ సెక్రటరీ అఖిలకర్ణాటక ఆయుర్వేదప్రచారకమండలి,బసవన్‌గుడి బెంగుళూరు సిటీ. విలాసమునకు ౩౦ నవంబరు తేదీలోగా బంపవలెను.అట్లుపంపనిచో తగువసతులు రాబోవు ప్రతినిధులకు లభింపవు. మహాసభాహ్వానము కొఱకును,కర్చులకొఱకును విరాళములనొసగి ప్రోత్సహించువారు తగు సహాయము చేయవలసినదని ప్రార్థించుచున్నాము. విరాళములు, డెలిగేటు రుసుములు నీదిగువ నుదాహరింపబడిన విలాసములకు పంపుడు.

వైద్యభూషణ డి.కె.భరద్వాజ M D. [Ay]
ఆర్గనైజింగుజనరల్ సెక్రటరీA K A P.మండలి,
బసవన్‌గుడి, బెంగుళూరుసిటీ.

ప్రొఫెసర్ డి. రంగాచార్యులు,
ప్రెసిడెంటు,
అఖిలభారత ఆనువంశిక ఆయుర్వేదవైద్య సంఘము గుంటూరు.

---

## హైదరాబాదు ఆయుర్వేద వైద్యసంఘము

### ౨౫వ సాధారణ సమావేశము

౪–౧౨–౧౯౩౬వ తేదీ శుక్రవారం సాయంత్రం హరితాయుర్వేదాశ్రమమున కవిరాజ శ్రీ రోపల్లభగారి అధ్యక్షతను జరిగెను. ప్రార్థనానంతరము "ఆరోగ్యము" అను విషయమును గురించి శ్రీమాన్ వైద్యభాస్కర, వైద్యరాజ,వరదాచార్యగారుపన్యసించిరి. తరువాత చిరంజీవి పురుషోత్తమవిద్యార్థి "రక్తపిత్తము" అను వ్యాధినిగురించి తానువ్రాసిన వ్యాసమును చదివెను. తరువాత అధ్యక్షుని అంత్యోపన్యాసముతో ముగిసెను.

తరువాత ఆదేశాలమునందు ధన్వంతరిజయంతినిగురించినకార్యనిర్వహణమువిషయమై ఆలోచించుటకు కా.ని. సభజరిగెను. అధ్యక్షులీ మహోత్సవ నిర్వహణమునకు సభ్యులందరి సహాయమునుకోరిరి. చాలా తీర్మానములు అంగీకరింపబడెను.

డా. ఆచార్య.
[ప్రచురణ శాఖాధికారి]

---

## హీరాలాల్ గాంధిగారి మతము మార్పు

నిర్బంధము వలనగాని,
ధనకాంక్షవలనగాని జరుగలేదు

ఆర్యసమాజ కార్యదర్శి ప్రకటన

బొంబాయి నవంబరు ౩౦ —

బొంబాయి ఆర్యసమాజ కార్యదర్శులగు వ్రిజలాలు ఆర్ మెహతాగారీ క్రింది ప్రకటన గావించిరి:—

హీరాలాల్ గాంధిగారు మరల హిందూమతమున చేరుటకు ఆర్యసమాజమువారు హీరాలాల్ గాంధిగారికి చాల పెద్దమొత్తము లంచమిచ్చిరని కొన్ని ముస్లింపత్రికలలో ప్రచురించిరి కలకత్తాలోని స్టార్ ఆఫ్ ఇండియా పత్రికలో కూడ ఈవార్తలను ప్రచురించిరి హీరాలాల్ గాంధిగారు హిందూమతమున చేరుటకు లంచమేమియు యీయబడలేదని ఆర్యసమాజమువారు ప్రజలకు తెలియజేయ గోరుచున్నారు మహర్షి దయానందగారి ఉపదేశానుసారము ఆర్యసమాజమువారు తమవిద్యుక్తధర్మమును నెరవేర్చిరి ఆశపెట్టుటవలనగాని బెదిరించుటవలనగాని మతమార్చుటకు ప్రయత్నించుట ఆర్యసమాజమువారు చేయరు.

## జర్మను గ్రంథప్రచురణకర్తలమహాసభ

వీమారలో జరిగెను అందువిదేశములలోని గ్రంథప్రచురణ కర్తలను ఏరాజ్యముగాని ఏసంస్థగాని అపఖ్యాతికల్గించు ప్రచారముగల గ్రంథములను ప్రకటించవలదని కోరుటకు తీర్మానించిరి ఇదేవిధముగ “డిక్టేటరుపరిపాలన”ను దూషించు వ్రాతలనెవరును వ్రాయకుండుటకై అంతర్జాతీయముగనొక ఒడంబడిక చేసికొనుట సాధ్యమగునేమో అన్నిదేశముల అభిప్రాయములను కనుగొనుటకు నిశ్చయించబడెను

## బ్రిటనులో దీపావళి

బ్రిటనుదేశములో కూడ మనదీపావళివంటిదే ఒకఉత్సవము జరుపబడుచుండును అప్పుడు అక్కడను పటాకులు, మందుసామానులు కాల్చబడుచుండును

## నిజముగా రష్యాదేశమే క్రైస్తవభక్తిగలది

సాధారణముగా రష్యాదేశములో మతమును నడిపేదనుచుందురు బ్రిటనుమున్నగుదేశములు రష్యాను తలిపేసినందుకు చెప్పు అనేక కారణములలోనిది యొకటి కాని ఇటీవల లండనులో క్రైస్తవమతప్రచారకుల సభయొకటి జరిగినది అందు రెవరెండు విక్టరుమోడీగారు ఇట్లు చెప్పిరి “క్రైస్తవమతమును నవలంబించుచున్నామనుచున్న మనకు రష్యావారు చేయుచున్నదేయున్నది. ఏలనగా, మనము క్రైస్తవాదర్శములను సాధించలేకపోతిమి ప్రతివాడును తనలాభమును మాత్రము చూచుకొను ప్రాతపద్ధతి తప్పక ఎత్తివేయవలసినదే దానికిబదులు సంఘలాభము ప్రధానముగ భావించుపద్ధతి రావలసినదే

## బ్రిటనులో వస్త్యంధావుక పెంపుట

బ్రిటనులో వస్త్యంధావుక మరలఇప్పుడు హెచ్చుచున్నట్లు చెప్పుచున్నారు పూర్వము వస్త్యంధావుక [illegible] కాని క్రీ. శ. ౧౯౩౦ [illegible] [illegible]

